# నౌకా యుద్ధతంత్రంలో శిక్షణకు కేంద్రం

## ప్రధాని నెహ్రూచే ప్రారంభోత్సవం

ఎర్నాకులం, అక్టోబరు 2: భారతీయ నౌకాదళానికి యుద్ధ తంత్రంలో శిక్షణ ఇవ్వడానికి ఇక్కడ నెలకొల్పబడిన శిక్షణ కేంద్రానికి ప్రధానమంత్రి నెహ్రూ ఇవాళ ప్రారంభోత్సవం జరిపారు.

సముద్రంపై యుద్ధాలు జరిగినప్పుడు వ్యూహాలు పన్నడం, శత్రువును నిర్జించడానికి పద్ధతులు కనిపెట్టడం, మొదలైన యుద్ధ తంత్రాలలో నావికోద్యోగులకు ఇక్కడ సమగ్ర శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ నౌకలను ఎకాఎకి సముద్రంలోకి తీసుకుపెళ్ళి ఆచరణ రీత్యా ఇట్టి శిక్షణ గఱపడం వ్యయాత్మకమైన విధానం. ఇప్పుడు ఇక్కడ నెలకొల్పిన కేంద్రంలో శిక్షణ అంతటి వ్యయాత్మకమైనది కాదు. దీనికిఇక్కడ ప్రత్యేకంగా ఒక భవనం నిర్మించబడింది. ఇండియా పాకిస్థాన్‌లు విడిపోయినప్పటి నుండి, భారతీయ నౌకాదళానికి కొచ్చిన్‌నే ప్రధాన శిక్షణ కేంద్రంగా రూపొందించడానికి కృషి జరిగింది.

భారత నౌకాదళాధిపతి వైస్ అడ్మిరల్ మార్క్ పిజీ ఇవాళ ఈ విషయం ప్రస్తావిస్తూ మన నౌకాదళానికి యుద్ధ తంత్రంలో శిక్షణకు ఒక సంస్థ నెలకొల్పడానికి ఇది ప్రథమ పర్యాయమనీ, మన దళాలకు మనమే శిక్షణ ఇచ్చి సామర్థ్యవంతులుగా చేయగలిగే గర్వకారణమైన శుభదినం కోసం ఆకాంక్షిస్తున్నామనీ, ఈ లక్ష్యసిద్ధికై ఈ శిక్షణ స్థావరాలకు శాశ్వత భవన నిర్మాణ కార్యక్రమం చురుకుగా సాగుతున్నదనీ అన్నారు.

ప్రధాని నెహ్రూ ఢిల్లీ నుండి భారత వైమానిక శాఖ విమానంలో బయలుదేరి నేటి మధ్యాహ్నం 3-30 గంటలకు ఎర్నాకుళంలో దిగారు. రక్షణశాఖ ఉపమంత్రి సతీష్‌చంద్ర, భారత నౌకాదళ ఉపఅధిపతి ఆర్. డి. కటారిగార్లు ప్రధానివెంట వచ్చారు.

విమానాశ్రయంలో తిరు కొచ్చి రాజప్రముఖ్, ముఖ్యమంత్రి, భారత నౌకాదళాధిపతి మార్క్ పిజీ గార్లు ప్రధానికి స్వాగతమిచ్చారు. రాజప్రముఖ్ ప్రధానికి పుష్పమాలవేశారు.

ఐ. ఎన్. ఎస్. వెందురితి నౌకాదళంవారు గౌరవవందనం సమర్పించారు.

కొచ్చిన్ శిక్షణ స్థావరంలోని వివిధ కేంద్రాలను చూచాక ప్రధాని పతాక నౌక ఐ. ఎన్. ఎస్. ఢిల్లీని అధిరోహించారు. వెంటనే గౌరవసూచకంగా తుపాకులు పేల్చబడినవి. పతాకోద్యోగి రియర్ అడ్మిరల్, ఎఫ్. ఎ. బాలన్స్ ప్రధానికి స్వాగతమిచ్చారు. తరువాత ప్రధానికి గౌరవవందనం సమర్పించబడింది. ఈనౌకపైనే ప్రధాని గౌరవార్థం విందుచేయబడింది. తరువాత అనేక ఉద్యోగులు ప్రధానికి పరిచయం చేయబడ్డారు.

సాయంకాలం యుద్ధతంత్ర శిక్షణ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపి, తదనంతరం నౌకాదళంవారి వినోద కార్యక్రమాలను ప్రధాని తిలకించారు.

### పడవల పోటీలు

భారత నౌకాదళానికి చెందిన పడవలపోటీ నేటిక్కడ ప్రారంభించబడింది. ప్రస్తుతం ఇక్కడవున్న 10 నౌకలకు చెందిన 12 పడవలు నేటి పోటీలలో పాల్గొన్నాయి. నావికులు ఉద్యోగులూ, అధికారులూ, కో స్త్రా శిక్షణ స్థావరం 'వెందురుతి' సిబ్బంది అపరిమిత ఉత్సాహంతో పోటీలో పాల్గొన్నారు. ఇవాళ మొత్తం 8 పోటీలు జరిగాయి. రేపు జరుగనున్న మరి ఎనభై పోటీలలో కొన్నిటిని ప్రధాని తిలకించి గెలుపొందినవారికి బహుమతులు పంచిపెడతారు.

## చంద్రనగర్ విలీనం

### హుగ్లీజిల్లాలో చేరిక

చంద్రనగర్, అక్టోబరు 2: పూర్వం ఫ్రెంచి స్థావరంగా వుండి, అనంతరం ఇండియా ప్రభుత్వం అధీనంలోకివచ్చిన చంద్రనగర్ పట్టణం నేడు పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం అధీనం చేయబడింది. చంద్రనగర్‌ను నేడు పశ్చిమ బెంగాలులో కలిపివేశారు.

ఈ పట్టణం 4 చ॥ మై॥ వైశాల్యం కల్గింది. జనాభా 49 వేలు. ఇవాళ్లి మధ్యాహ్నం 12 గంటలకు దీన్ని కేంద్రం ప॥ బెంగాల్ పరం చేసింది.

చంద్రనగర్ పాలకుడు, జిల్లా మేజస్ట్రేటు శ్రీ యు. సి. రాయ్ ఈ నగరాన్ని నేడు ప॥ బెంగాల్ ప్రభుత్వం ప్రతినిధి హుగ్లీ జిల్లాకలెకరు శ్రీ ఎస్. రాయ్ అధీనం చేశారు. చంద్రనగర్ పరిపాలకుడు ఇక ఇప్పుడు హుగ్లీ అడిషనల్ జిల్లా మేజస్ట్రేటుగా పనిచేస్తూ, చంద్రనగరంలో మకాంచేసివుంటారు.

## హనోయ్‌లో ప్రధాని నెహ్రూ మకాం

హనోయ్, అక్టోబరు 1: చైనాకు పోతూ దారిలో అక్టోబరు 17 వ తేదీ నాడు భారత ప్రధానమంత్రి నెహ్రూ హనోయ్‌లో ఆగుతారని అధికారికంగా వియత్ మిన్ ప్రభుత్వానికి, ఫ్రెంచి లెయిజాన్ మిషనుకు తెలియజేయ బడింది.

హనోయ్‌లో ఆగినప్పుడు నెహ్రూ కార్యక్రమం ఏమిటో తాను ఫ్రెంచి వారితోను, వియత్ మిన్‌తోను సంప్రతించి నిర్ణయిస్తున్నట్లు అంతర్జాతీయ కంట్రోల్ కమిషన్ అధ్యక్షులు శ్రీ ఎం. జె. దేశాయ్ నేడు ఒక ప్రకటన చేశారు.

భారత విమాన బలానికి చెందిన ఒక ప్రముఖోద్యోగి నేడు హనోయ్ విమానాశ్రయంలో దిగి, నెహ్రూ విమానం దిగడానికి అవసరమైన ఏర్పాట్లు పూర్తి చేయించారు.

# సింహళ భారతీయులు

## కొలంబో ప్రభుత్వ దుస్తంత్రం

### భారతపౌరసత్వం స్వీకరిస్తే బోనసులు

కొలంబో, అక్టోబరు 2: ఇండో-సింహళ సంధిని అనుసరించి స్వచ్ఛందంగా ఇండియా పౌర సత్వాన్ని స్వీకరించే సింహళ భారతీయులకు ఉపకార భృతులు, బోనస్సులు సింహళ ప్రభుత్వం ఇవ్వడానికి సింహళ ప్రభుత్వం నిశ్చయించుకున్నట్లు తెలుస్తున్నది.

పూర్వం ఏ పౌరసత్వంలేని సింహళ భారతీయులకు ఉద్యోగాలు, పనులు లభించకుండా చేయాలని, ప్లాంటర్లతో కలిసి ఈ ప్రభుత్వం ఆలోచించిందిగాని, అందుకు ఇండియా అభ్యంతరం చెప్పటంచేత ఇందుకు ఈ ప్రభుత్వం పూనుకుంటున్నది.

పోతే ఇక ఈ ప్రభుత్వం మంత్రులంతా నిన్న సమావేశమై ఢిల్లీలో శ్రీ నెహ్రూతో ఏమి మాట్లాడాలో ఆలోచించుకున్నారు. వీరితో సమావంగా సింహళ భారతీయ కాంగ్రెస్ ప్రతినిధివర్గం గూడా ఒకటి ఢిల్లీకి బయలుదేరుతోంది. ఈ ప్రతినిధివర్గం సోమవారం మద్రాసుకువచ్చి ఆరో తారఖు దాకా ఇక్కడవుండి, అనంతరం ఢిల్లీకి బయలుదేరి పోతుంది.

## 'సైనిక సమాఖ్యలు సమితికే హానికరం'

### సర్వసభ్య సభలో బర్మా ప్రతినిధి విమర్శ

న్యూయార్కు, అక్టోబరు 1:— మనీలా ఒప్పందం, దాని స్వభావం నేడు ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో విమర్శలకు గురిఅయినవి. బర్మా ప్రతినిధి వాలింగ్‌టన్ మాట్లాడుతూ, మనీలా ఒప్పందమని పేరు చెప్పి విమర్శించలేదు కాని, తటస్థ విధానాన్ని అనుసరిస్తున్న దేశాలు విజిగీషా మండలాల్లో చేరటం సమితికే హానికరమని హెచ్చరించారు.

"మాకు తెలిసినంతవరకూ యిటువంటి కూటములూ, సమాఖ్యలూ లేకుండా ఉండటమే సమితి ఆశయం. ప్రతిదేశమూ ప్రతివిషయాన్నీ కేవలం దాని మంచిచెడ్డలనుబట్టే పరిశీలించాలే కాని, అది తమకూటమి ప్రయోజనాలకు అనుకూలంగా ఉన్నదా, లేక ప్రతికూలంగా ఉన్నదా అని చూడకూడదు. బర్మావంటి కొన్ని దేశాలు ఏ కూటములోనూ చేరకుండా అనుసరిస్తున్న తటస్థ విధానం చాలా ఉపయోగకారిగా ఉన్నది. ఈ విధానమే ప్రపంచ శాంతి రక్షణలో సమితికి ముఖ్యసాధనం కూడా కాగలదు.

ఈ పరిస్థితుల్లో, తటస్థ విధానాన్ని అనుసరిస్తున్న కొన్ని దేశాలు, ఆ విధానాన్ని వదిలివేయటం చాలా శోచనీయం. ఇది సమితి భవిష్యత్తుకు శుభసూచకంగా లేదని మాత్రం హెచ్చరించవలసి వుంటుంది" అని ఆయన వివరించారు.

ఇండొనీషియా ప్రతినిధి డా॥ సుబార్యోకూడ, ఇదేవిధంగా, పేరు పెట్టకుండా, మనీలా ఒప్పందాన్ని నిరసించారు. తటస్థ రాజ్యాలు విజిగీషా మండలాలతో సైనిక, ప్రాంతీయ ఒప్పందాలద్వారా చేయికలపటం ఎక్కువవుతున్నదనీ, దీనిలోవచ్చే ప్రమాదాలను గురించి ఇండొనీషియా మొదటినుంచీ హెచ్చరిస్తూనే ఉన్నదనీ ఆయన అన్నారు.

డలెస్, కేసీలు ఒప్పందం పేరు చెప్పి, దానిని సమర్థించినా, విషిన్‌స్కీ దానిని విమర్శిస్తూ, ఆసియా ప్రజలను ఒకరిమీద ఒకరిని కత్తిఎత్తించటానికి చేసిన కుట్రఅని ఖండించారు.

పాకిస్థాన్ ప్రతినిధి జఫ్రుల్లామాట్లాడుతూ ప్రస్తుతం జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధంలో ఇటువంటి ఒప్పందాలు అత్యవసరమని అన్నారు. కొలంబోరాజ్యాలు అయిదింటిలోనూ పాకిస్థాన్ ఒక్కటే ఒప్పందంపై సంతకంచేసింది.

### ఫిలిప్పీన్సు ఆలోచన

మనీలా, అక్టోబరు 2: మనీలా సంధిలో చేరవలసిందిగా బర్మాను ఆహ్వానించడాన్ని గూర్చి తాము ఆలోచిస్తున్నట్లు ఫిలిప్పీన్సు ఉపాధ్యక్షుడు విదేశాంగమంత్రి కార్లోస్ గ్రేషియ నేడు వెల్లడిచేశారు.

### ఢిల్లీకి కరాచీ నిరసన

కరాచీ, అక్టోబరు 2: కలకత్తాలో డిప్యూటీ హైకమిషన్ కార్యాలయం పైజరిగిన కొల్లలగురించి పెలువడిన నివేదికపట్ల పాక్ ప్రభుత్వం తమ నిరసన తెలియజేసినట్లు డాన్ పేర్కొన్నది.

### జాతీయాభివృద్ధి సంఘం

న్యూఢిల్లీ, అక్టోబరు 2: జాతీయాభివృద్ధి సంఘ సమావేశం నవంబరు 9 10 తేదీల్లో ఇక్కడ జరుగుతుంది. శ్రీ నెహ్రూ అధ్యక్షత వహిస్తారు.

# విజ్ఞాన వ్యాప్తికి రేడియో వినియోగం

## 'రేడియోనెల' కార్యక్రమానికి కేంద్రమంత్రి కేస్కర్ ప్రారంభోత్సవం : నెహ్రూ సందేశం

న్యూఢిల్లీ, అక్టోబరు 2: రేడియో శ్రవణంపట్ల దేశవ్యాప్తంగా ప్రజలలో ఆసక్తిని పెంపొందించే సంకల్పంతో ఆలిండియా రేడియోవారూ, రేడియో వ్యాపారస్థులూ కలిసి ఏర్పాటుచేసిన "రేడియోనెల" ప్రత్యేక కార్యక్రమాలకు కేంద్ర బ్రాడ్‌కాస్టింగ్ శాఖ మంత్రి డా॥ బి. వి. కేస్కర్ నేడు పార్లమెంటు భవనంలో ప్రారంభోత్సవం చేశారు.

నేటి ప్రపంచంలో అధికతర ప్రాముఖ్యంవహిస్తున్న రేడియోని కేవలం వినోద పరంగానే కాక, విద్యాసాంస్కృతిక పరంగా కూడా పూర్తిగా సద్వినియోగం చేసుకోవడం అవసరమనీ ఈనాడు బ్రాడ్‌కాస్టింగ్ మంత్రిత్వ శాఖ ఈ రేడియో నెల ప్రారంభించడం ముదావహమనీ, దీని ద్వారా ప్రజలలో రేడియో అభినివేశం సువ్యాప్తం కాగలదని ఆశిస్తున్నాననీ ప్రధాని నెహ్రూ ఈ ఉత్సవానికి సందేశం పంపారు.

ప్రధాని సందేశం రికార్డుచేయబడి ప్రారంభోత్సవసభలో ప్రసారంచేయబడింది.

బ్రాడ్‌కాస్టింగ్ మంత్రి డా॥ బి. వి. కేస్కర్‌గారు ప్రసంగిస్తూ ఈ రేడియో నెలకార్యక్రమాలవల్ల ప్రజలకు రేడియో సాగిస్తున్న వివిధకార్యకలాపాలన్నీ సువిదితం అవడమేకాక, శ్రోతల సమాజంలో ప్రతివారి ప్రతిపత్తికూడా గ్రహించుకోడానికి అవకాశం ఏర్పడగలదనీ, ఈ కార్యక్రమాలవల్ల దేశంలో రేడియో శ్రోతలసంఖ్య పెరగడంతోపాటు ఇదివరకు నుండి రేడియో వినేవారికి రేడియోశ్రవణం పట్ల ఆసక్తి ఇతోధికం కాగలదని తమ ప్రగాఢ విశ్వాసం ప్రకటించారు.

రేడియో ఉత్పత్తిదారుల సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ ఎ. ఎం. డిక్రూర్స్ ప్రసంగిస్తూ ఈ రేడియో నెల కార్యక్రమం అనేది నిరుపమానమైనదనీ, ఇదివరలో ఎక్కడ జరుపబడ లేదనీ, ఇది ఎన్నో విధాల అందరికీ మేలుచేకూర్చ గలదనీ అన్నారు.

రేడియో వ్యాపారస్థులసంఘ ప్రతినిధి శ్రీ కె. ఎల్. బన్సాల్ మాట్లాడుతూ, రేడియో వ్యాప్తికై, తమ సంఘం, దేశసేవాభిమానంతో కృషి చేయగలదని అభిభాషించారు.

ఈ కార్యక్రమాలను ఆలిండియా రేడియో వారు ప్రసారంచేశారు.

కేస్కర్‌గారు తమ ప్రారంభోపన్యాసంలో ఈ కార్యక్రమ లక్ష్యాలను వివరిస్తూ నేటి ఆలిండియా రేడియో వ్యవస్థను మరింత పటిష్టం చేయడమే ప్రథమ ఆశయమనీ, ఇందుకై ప్రభుత్వం సాగిస్తున్న కార్యక్రమాలలో, మీడియంవేవు ప్రసార యంత్రాలు నెలకొల్పడానికే అత్యధిక ప్రాధాన్యత ఇస్తున్నదనీ ఈ మీడియం వేవుపైచేసే ప్రసారాలు వాతావరణ ప్రాబల్యత వల్ల దెబ్బ తినవనీ, ప్రసారం ఒడుదుడుకులూ, లేకుండా సాఫీగా వినబడుతుందనీ చెప్పారు.

ఇదివరకే బొంబై జలంధర్, అహమదాబాద్‌లో హైపవర్ కిలోవాట్ ప్రసార యంత్రాలు నెలకొల్పబడినవనీ, ఇట్టివే లక్నో, బెంగుళూరు, కలకత్తాలలో ఏర్పాటు అవుతున్నవనీ, పోతే విజయవాడ, మద్రాసు ఇండూరు, జయపూర్, పాట్నా, ఢిల్లీలలో 20 కిలోవాట్లు ప్రసార యంత్రాలు వచ్చే ఆర్థిక సంవత్సరాంతంలోగా నెలకొల్పబడగలవనీ ఆయన చెప్పారు.

ఈ పంచవర్షప్రణాళిక క్రింద తలపెట్టిన కార్యక్రమాలు అమలుజరిగితే, వచ్చే ప్రణాళికలో ఖాళీలో భర్తీ చేసుకోవడం, ఉన్న కేంద్రాలను మరింత పటిష్ఠం చేయడం సాగించబడుతుందని వీలైతే వచ్చే ప్రణాళికలో టెలివిజన్ స్థాపనకూడా ప్రయత్నం జరుగుతుందికాని, టెలివిజన్ అధిక వ్యయాత్మకమైనదవడంవల్ల అది మొదట్లో భారీ ఎత్తున తలపెట్టబడదనీ డా॥ కేస్కర్ చెప్పారు.

## మద్యనిషేధ సిబ్బందిపై దౌర్జన్యం

### ఒక తుపాకి అపహరణ

విశాఖపట్టణం, అక్టోబరు 3: శృంగవరపుకోట తాలూకాలో కర్లంపూడి పోలీసుస్టేషన్ అజ్మాయిషీక్రిందవున్న ఒక గ్రామంలో మద్యనిషేధ సిబ్బంది-ఒక సబ్ ఇన్‌స్పెక్టరు ఇద్దరుగార్డులు-దాడిచేయడానికి వెళ్లిన సందర్భంలో, మద్యనిషేధ సిబ్బంది తాలూకు ఒక తుపాకి అపహరించారు. నిందితులలో ఒకడి దగ్గర అక్రమంగా మోటారు ట్యూబులో దాచిఉంచిన సారా ఉండగా సబ్ ఇన్‌స్పెక్టరు అతనిని పట్టుకొనబోయాడని, అందులో అతడు కత్తిపుచ్చుకొని సబ్ ఇన్‌స్పెక్టరును గాయపరిచాడని, సబ్ ఇన్‌స్పెక్టరు మూడు పర్యాయములు రివాల్వరు కాల్చాడని తెలిసింది. రివాల్వరు కాల్పులవల్ల గాయపడిన వ్యక్తిని నిన్న హాయంత్రం చికిత్సనిమిత్తం యిక్కడి కింగ్ జార్జి ఆస్పత్రిలో చేర్చారు. (స్వ. వి.)

## భూమిశిస్తు మినహాయింపు

### రైతుసంఘాల నాయకుల ప్రశంస

విజయవాడ, అక్టోబరు 3: గిట్టుబాటుగాని అన్ని కమతాలకు శిస్తుమాఫీ చెయ్యాలనే తమ కోరికను కొంతవరకే ఈ నిర్ణయం తృప్తిపరుస్తున్నప్పటికీ, పదిరూపాయలవరకూ శిస్తుమాఫీ చేస్తూ ప్రభుత్వం చేసిన నిర్ణయం బీదరైతులకు కొంతవరకు సాయపడగలదని ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘఅధ్యక్షులు కడియాల గోపాలరావు, ఆంధ్ర వ్యవసాయ కూలీలసంఘ అధ్యక్షులు కాట్నేటి మోహన్‌రావు, చలసాని వాసుదేవ గారలు మా విలేఖరికి తెలియజేశారు. ప్రభుత్వ నిర్ణయం పట్ల తమ హర్షాన్ని వెలిబుచ్చారు.

ఈ నిర్ణయాన్ని, వాస్తవంగా బీదవారైన అన్ని జాయింటుపట్టాలకు, జాయింటు పట్టాదార్లకుకూడా వర్తింపజెయ్యాలనీ, జాయింటు పట్టాలలో వారి, వారికి శిస్తువిభజించబడినప్పుడు, విడి విడి మొత్తాలు పదిరూపాయలకన్న తక్కువ ఉండే కమతాలకుకూడా శిస్తు చెల్లింపునుంచి మినహాయించాలనీ సూచించారు.

బడ్జెట్టులోటును భర్తీచేయటానికి ప్రభుత్వం ఉద్దేశించే కొత్త పన్నుల ద్వారా బీదవారికి భారాన్ని కలిగించరాదనీ, ధనికులకే వెయ్యాలనీ కూడా పేర్కొన్నారు. (స్వ. వి.)

## రెవిన్యూ మంత్రి మైసూరు ప్రయాణం

కర్నూలు, అక్టోబరు 2: అక్టోబరు 4 వ తేదీ నుండి 7 వ తేదీ వరకూ మైసూరులో జరిగే దసరా ఉత్సవాలలో పాల్గొనే నిమిత్తం రెవిన్యూమంత్రి శ్రీ. కోటిరెడ్డిగారు ఈరోజున మధ్యాహ్నం ఇక్కడినుంచి బయలుదేరి వెళ్లారు.

# పరిశ్రమలకు కావలసిన యంత్రసామగ్రి ఉత్పత్తి

## అత్యవసరమని 'ట్రాన్స్‌ఫార్మర్ ఫ్యాక్టరీ' ప్రారంభోత్సవంలో శ్రీ కే. సి. రెడ్డి ఉద్బోధ

మదరాసు, అక్టోబరు 3: ఇండియా ప్రభుత్వ ఉత్పత్తిశాఖ మంత్రి శ్రీ కే. సి. రెడ్డిగారు యీరోజు ఉదయం తిరువత్తియూరులో రేడియో ఎలెక్ట్రికల్సు లిమిటెడ్ నూతన భవనంలో ట్రాన్సుఫార్మర్ ఫాక్టరీ ప్రారంభోత్సవము జరుపుతూ దేశమున భారీపరిశ్రమల నిర్వహణ విషయంలో మనము సాధ్యమైనంతవరకు విదేశీయ సాంకేతిక నిపుణులపై ఆధారపడడము తగ్గించుకోనేందుకు ప్రయత్నించాలని ఉద్బోధించారు.

రేడియో ఎలెక్ట్రికల్సు కంపెనీ ట్రాన్సుఫార్మర్ ఫాక్టరీ ప్రారంభోత్సవం జరుపవచ్చిన శ్రీ కే. సి. రెడ్డిగారికి కంపెనీ డైరెక్టరులబోర్డు అధ్యక్షుడు శ్రీ వి. రామకృష్ణగారుస్వాగతమొసగుచూ సభకు శ్రీ వి. వి. గిరిగారిని అధ్యక్షత వహించవలసిందిగా కోరారు.

శ్రీ వి. వి. గిరిగారు మాట్లాడుతూ పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికలను తయారుచేయడంలో శ్రీ వి. రామకృష్ణగారు భవిష్యత్తున 20 యేండ్లతరువాత అవసరాల ఊహించి తదనుగుణ్యముగా పరిశ్రమలకు అవసరమైన పనులను జరుపగల శక్తిగలవారై యున్నారని "ట్రాన్సుఫార్మర్లను" భారతదేశంలోనే తయారుచేయాలనే ఉద్దేశ్యంతో, వారు ఫాక్టరీలను స్థాపించియున్నారనియు చెప్పారు.

యూనియన్ ప్రభుత్వ ఉత్పత్తిశాఖామంత్రి శ్రీ కే. సి. రెడ్డిగారు, ఫాక్టరీ ప్రారంభోత్సవం జరుపుతూ దేశంలో నిర్మాణాత్మకమైన దేశీయ కర్మాగారాలు స్థాపించి పరిశ్రమలను వృద్ధిపరచాల్సిన అవసరమెంతైనా కలదని అన్నారు. భారతదేశమును బలమైనదేశము సంపత్కరమైన దేశముగాను చేయుటకు యిండియా ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికల మూలమున కృషి చేస్తున్నారని అన్నారు.

భారతదేశమునకు కావలసిన వస్తుసామగ్రి ఉత్పత్తిలో స్వయంసమృద్ధిని సాధించటానికి కృషిచేసి వంతమాత్రం ప్రయోజనంలేదు. భారతదేశంలోభారీ పరిశ్రమల నిర్వహణ విషయంలో మనం విదేశీయ సాంకేతిక నిపుణులపై ఆధారపడ్డం యింకా జరుగుతోంది. కొంత నిర్ణీత కాలంలోనైనా మన పరిశ్రమలు విదేశీయ నిపుణులపై ఆధారపడకుండా అట్టి పరిజ్ఞానమును సంపాదించిన భారతీయ నిపుణుల సహాయంతోనే పరిశ్రమలను నిర్వహించుకొనుటకు ప్రయత్నం జరగాలి. విదేశాలనుండి మన పరిశ్రమలకు యంత్రసామగ్రి తెప్పించుకొనే పద్ధతి మంచిదికాదు. మన పరిశ్రమలకు కావలసిన యంత్రసామగ్రి విషయంలో భారతదేశం స్వయంపోషకం కావటానికి ప్రయత్నించకపోతే ఎన్ని పంచవర్ష ప్రణాళికలు అమలుపరచినప్పటికీ ప్రయోజనం కలగదని మన అవసరాలకు తగిన యంత్రసామగ్రిని దేశంలోనే తయారు చేయటానికి కృషి చేయడం అవసరమనియు చెప్పి అట్టి ఉద్దేశ్యంతో నిర్వహింపబడేయీ ఫాక్టరీ ప్రారంభోత్సవం జరపడం తమకు సంతోషదాయకమనీ శ్రీ కేసిరెడ్డి గారు చెప్పారు.

దేశంలో పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించుటకు భారత ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలు పారిశ్రామికులకు సర్వవిధములా సహాయ్యపడగలరని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ సి. యం. శ్రీనివాసన్‌గారు వందనములు తెలిపారు.

అనంతరం శ్రీ కే. సి. రెడ్డిగారు రేడియో ఎలెక్ట్రికల్సు ఫాక్టరీలో ట్రాన్సుఫార్మర్ల నిర్మాణమును వీక్షించారు.

శ్రీ వి. రామకృష్ణ ఐ. సి. యస్. (రిటైర్డు) గారు యూనియన్ ప్రభుత్వ ఉత్పత్తి శాఖామంత్రి శ్రీ కే. సి. రెడ్డిగారి గౌరవార్థం యీవాళ మధ్యాహ్నం కన్నిమారా హోటలులో విందు జరిపారు. ప్రధాన అతిథికి యితర అతిథులకు శ్రీ వి. రామకృష్ణగారు స్వాగతమిచ్చారు. యూనియన్ ప్రభుత్వ మాజీ మంత్రి శ్రీ వి. వి. గిరి, సర్ యస్. వి. రామమూర్తి, మదరాసు ప్రభుత్వ మంత్రి శ్రీ బి. పరమేశ్వరన్, ఆంధ్ర రెవిన్యూబోర్డు సభ్యులు శ్రీ కె. యం. ఉన్నితన్, శ్రీ ఎం. పి. పాయి, న్యా॥ బషీర్ అహ్మద్ సయ్యద్, శ్రీ వి. ఎస్. సుబ్రహ్మణ్యం ఆంధ్ర సహకారశాఖ రిజిష్ట్రారు శ్రీ కె. సుబ్రహ్మణ్యంనాయుడు, స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టరు శ్రీ అయోధ్యాపురం రాఘవరెడ్డి, శ్రీ కొత్త రఘురామయ్య, శ్రీ మోటూరి సత్యనారాయణ, శ్రీ సి. జి. రెడ్డి, శ్రీ యం. బాపినీడు మొదలైన ప్రముఖులు దాదాపు 150 మంది విందుకు విచ్చేశారు. విందు అనంతరం శ్రీ కె. సి. రెడ్డిగారిని శ్రీ రామకృష్ణగారు అతిథులకు పరిచయం చేశారు.

## ట్రీస్టీ సమస్యపై ఒప్పందాలు

బెల్‌గ్రేడ్, అక్టోబరు 1: ట్రీస్టీ విషయమై లండన్‌లో జరిగిన 5 రాజ్యాల సమావేశంలో అన్ని ముఖ్యాంశాలను గురించి ఒప్పందం కుదిరినట్లు యుగోస్లావియా నేడు అధికారికంగా ప్రకటించింది.

ఈ ఒప్పందాన్ని అనుసరించి ట్రీస్టీ "ఏ" ప్రాంతంలో ఇటలీ పరిపాలన మే చెల్లుబడి అవుతుందని, అయినా జెనోవాలో (ఇటలీలో ఒక రేవు) స్విట్జర్లండుకు ఇచ్చినటివంటి హక్కులనే యుగోస్లావియాకు ఈ "ఏ" ప్రాంతంలో ఇటలీ యిస్తుందని బెల్‌గ్రేడ్ పత్రికలు వ్రాస్తున్నాయి.

# బాపూజీపట్ల భక్తిప్రపత్తులు

(1 వ పేజీ తరువాయి)

(1 వ పేజీ తరువాయి)

వ్యక్తికి మనం భక్తి ప్రపత్తులు చెల్లిస్తున్నాము. ఆయనకు భక్తి ప్రపత్తులు చెల్లించడం బహుసులభం. నా అభిప్రాయంలో ఆయనపట్ల మనం చూపవలసిన నిజమైనభక్తి ప్రపత్తు లేవంటే, ఆయన బోధనలను ఆచరణలో పెట్టడమున్ను, ఆయన ఏమిచేసియుండేవాడనుకొంటామో అది చేయడానికి పాటుపడడమే ఆయనయెడల నిజమైన భక్తి ప్రపత్తి ప్రదర్శనం కాగలదు. ఇప్పుడే గనక ఆయన భౌతికంగా మనమధ్య ఉండివుట్లయితే ఏమిచేసి ఉండేవాడు? ఇందుకు అనేక సమాధానాలుంటాయనుకొంటాను. అందులో ఒకటి ఇది అయివుంటుంది. దేశ నిర్మాణానికిన్ని, అభివృద్ధికిన్ని ఆయన ఆత్మనూ, దేహాన్ని అంకితం చేసి వుండేవాడు. ఆయనకు స్వరాజ్య సిద్ధి అసలు లక్ష్యసిద్ధికి కేవలం సాధనం మాత్రమే. ఇండియాలో ప్రతివ్యక్తికీ సంక్షేమ సౌభాగ్యాలు సమకూర్చడమే ఆయన పరమార్థలక్ష్యం. ప్రథమ పంచవర్షప్రణాళిక రూపొందే లోపలనే ఆయన చనిపోయాడు. ఆయన బ్రతికి యుండినట్లయితే, దేశసౌభాగ్య సాధనలోనూ, ఇండియాను ముఖ్యంగా ఆర్థికంగానూ, ఇతర విధాలా కూడ పైకి ఉద్ధరించడంలోనూ చాలా శ్రద్ధ వహించి వుండేవాడు. అందువల్ల మనం నిజమైన భక్తిప్రపత్తులు చెల్లింపదలిస్తే ఆయన చెప్పినట్లు నడుచుకొందాం. ఆయన ఏమిచేసి వుండేవాడో అది చూద్దాం.

దురదృష్టవశాత్తూ మనలో కలసివుండే వంత ఐకమత్యంలేదు. చిన్న చిన్న విభేదాలనుకూడ, అవి ఎంత అప్రధానమైనవైనా, వాటిని గోరంతలు కొండంతలు చేసుకొనజూస్తుంటాం. మనం ఏకీభవిస్తున్న అనేక విషయాలు మరచిపోతూ వుంటాం. తగవులతో మన కాలం చాలా వృథా చేస్తుంటాం.

ఇవాళ గాంధీజీ జయంతి ఆయనయెడల మనం భక్తి చూపాలి. ఎడతెరపి లేకుండా, కష్టముకోరుకుంటూ, సమష్టి కృషితో, సమష్టి భావంతో దేశ సంక్షేమానికి పాటుపడినప్పుడే ఆయనయెడల నిజమైన భక్తి ప్రదర్శించిన వారమవుతాము.

ఇవాళ ఈ గాంధీజీ విగ్రహాన్ని ఆవిష్కరిస్తున్నామంటే ఇది ఆయనను గౌరవించడంకాదు. మనలను మనం గౌరవించుకోవడమే. ఏ ఆదర్శం కోసమైతే ఆయన జీవితమంతా ధారపోశాడో, ఏ ఆశయ సాధనకైతే కలలు గంటూనే ఆయన చనిపోయాడో ఆ ఆశయ ఆదర్శాల సాధనకోసం ఈ రోజున మనమంతా ప్రతిన పూనుకొందాం."

## నెహ్రూ విగ్రహావిష్కరణ

అటు పిమ్మట ఉపముఖ్య మంత్రి నీలం సంజీవరెడ్డిగారు ప్రధాని పండిట్ నెహ్రూ విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ, పండిట్ నెహ్రూ గాంధీజీ ప్రియశిష్యుడనీ, ఉభయుల దృక్పథాల్లోనూ కలయిక లేకపోయినా ఆయన అడుగుజాడల్లో నడిచారనీ ప్రశంసించారు. పండిట్ నెహ్రూ గాంధీజీని గుడ్డిగా అనుసరించలేదన్నారు. గాంధీజీలోని మానవజాతి ప్రేమనూ, మానవజాతియోగక్షేమాలపట్ల ఆసక్తినీ నెహ్రూ బాగా జీర్ణించుకొన్నాడన్నారు. నిజంగా ఆయన గాంధీజీవారసుడన్నారు. గాంధీజీచూపినటే ఈయనకూడ ప్రపంచానికి శాంతిమార్గం చూపుతున్నాడన్నారు. ఉభయులూ శాంతి, సత్య పథాన్నే అనుసరించారన్నారు. వారి విగ్రహాలు ప్రతిష్ఠాపించేవారు కనీసం వారి మార్గాన్ని అనుసరించడానికి యత్నించనైనా యత్నించాలన్నారు.

స్పీకరు వెంకటరామయ్యగారు మాట్లాడుతూ, ప్రాణాలనుకూడ తెగించి, న్యాయమని నమ్మిన పథాన్ని అనుసరించినందుకు గాంధీజీని ప్రస్తుతించారు.

పేలాల కొండయ్యగారి కృతజ్ఞతాభివందనలతో సభ ముగిసింది.

సభాంతాన ఉపాహార విందు జరిగింది.

# రైలుప్రమాదంలో భారత సైనికుల అమోఘసేవ

## రైలుపెట్టెల క్రింద పడిపోయిన ప్రయాణీకులకు ప్రాణభిక్ష పెట్టడంలో ధైర్యసాహసాలు

హైదరాబాదు, అక్టోబరు 2: మొన్నటి హైదరాబాదు రైలు ప్రమాదమప్పుడు భారతసైనికులు చాలా సాహసమూ, ఔదార్యమూ ప్రదర్శించారు. తమ భద్రతనూ, క్షేమాన్ని కూడ గమనించకుండా, ప్రాణాలకు గూడా తెగించి, 60 మంది ప్రయాణీకులను దాదాపు నిశ్చిత మరణంనుంచి తప్పించి రక్షించారు. అరక్షింపబడినవారిలో స్త్రీలూ,పిల్లలూ కూడ వున్నారు.

చివరి పెట్టెలో ఉండిపోయి, దాదాపు 100 మంది సైనికులు క్షేమంగా గండం తప్పించుకొన్నారు. తమప్రాణాలు దక్కిన వంతే చాలనుకోకుండా వీరు ఆ కారుచీకటిలో, ఏడ్పులూ, హాహాకారాల జాడలనుబట్టి విపత్తులో పడిపోయిన తోటి ప్రయాణీకులను రక్షించడానికై ఉరికారు. బోర్లపడిన పెట్టెలఅడుగునబడినలిగిపోతున్న కొందరిని వెలికితీసి రక్షించారు. ప్రవాహం ఉరవడిలోపడి కొట్టుకుపోతున్న వారిని కూడ కొందరిని కాపాడారు. వ్యక్తిగతంగా ఇటువంటి వీరవిక్రమ సాహసోదాహరణలు చాలా ఉన్నాయని ఇక్కడి సైనికాధికారులు చెప్పారు.

హవిల్దార్ సోమయ్య అనే అతను ఆత్మప్రమాదాన్ని కూడ ఖాతరుచేయక ఒక రెండవతరగతి కప్పుమీదుగా దేకుకొంటూ వెళ్లి, నీళ్లలో అర్ధమగ్నమై యున్న ఆ పెట్టె కిటికీలను బద్దలుకొట్టి, కిటికీ ఊచలను వంచివేసి, బయటికి దారికల్పించి, లోపల ఉన్న చాలా మంది ప్రయాణీకులను రక్షించారు. ఇంకొక సైనికుడు ఇట్లాగే ప్రాణానికి తెగించి, విరిగి కూలిపడిపోయిన ఒక పెట్టెలో చిక్కుకొని బాధపడుతున్న ఒక స్త్రీని కాపాడాడు.

కూలిపడ్డ పెట్టెల్లోనూ, పెట్టెల కిందా మరికొందరూ ప్రాణాలతో మిగిలినవారు తేరుకొని రూఢిచేసుకొన్న పిమ్మట, ఆ సైనికుల్లో అయిదుగురు పెపెట్ దిశోజా నాయకత్వాన బయలుదేరి ఒక గ్రామ స్టేషనుకువెళ్లి, అక్కడి అధికారులకు ఈ దురంతవార్త తెలియజేసి, సాయం పంపమని కోరారు. ఈలోపల అక్కడ తక్కిన సైనికులు గాయపడ్డ స్త్రీలకూ, పిల్లలకూ ఉపచారాలుచేస్తూ వచ్చారు. నీళ్ళలో నాని చలికి గజగజలాడుతున్న వారికి తమ సంచుల్లోనుంచి బట్టా పాతా తీసియిచ్చారు. తెల్లవారిం తర్వాత శివాలగాలింపులోనూ,ప్రయాణీకుల సామానుల భద్రపరచడంలోనూ కూడ చాలా తోడ్పడ్డారు.

## సికింద్రాబాదు కార్పొరేషన్ సానుభూతి

హైదరాబాదు, అక్టోబరు 2: కాజీపేట రైలుప్రమాదంలో మరణించిన వారి కుటుంబాలకు సికింద్రాబాదు మున్సిపల్ కార్పొరేషన్ సానుభూతి ప్రకటించింది. ఒక సహాయకమిటీని ఏర్పరచి యిందు నిమిత్తం రు. 501 లు మంజూరు చేశారు.

మరికొన్ని వార్తలు (5-వ పేజీలో)


యుజిపల కాకినాడలో కలక్టర్ల సమావేశం జరిగిన సందర్భంలో తీయబడిన ఛాయాచిత్రం.


రాజమండ్రిలో సెప్టెంబరు 26 వ తేదీన జరిగిన అఖిలాంధ్ర కళాశాలల విద్యార్థి ప్రతినిధుల మహాసభలో పాల్గొన్న విద్యార్థులు.


ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారు సెప్టెంబరు 26 వ తేదీన రాజమండ్రిలో రాష్ట్ర కళాశాలల విద్యార్థి మహాసభలో పాల్గొనుటకు వచ్చినప్పుడు కళాశాలా విద్యార్థి ప్రతినిధులు స్వాగతమిచ్చారు.


ఆర్థిక మంత్రి తెన్నేటి విశ్వనాథంగారు యుజిపల రాజమండ్రి వచ్చినప్పుడు స్టేషనువద్ద పుర ప్రముఖులు స్వాగత మిచ్చారు.


ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారు నెల్లూరులోని అనాథ [illegible] శరణాలయాన్ని సందర్శించినప్పటి ఫోటో. [illegible]


స్త్రీల సాంఘిక సంక్షేమ సలహాసంఘ అధ్యక్షురాలు శ్రీమతి చెన్నగంటమ్మగారు కాకినాడలో శ్రీ విద్యార్థినీ సమాజము దర్శించినప్పుడు తీసిన ఛాయాచిత్రం.


స్త్రీల సాంఘిక సంక్షేమసంఘ సలహాసంఘ అధ్యక్షురాలు శ్రీమతి చెన్నగంటమ్మగారు తణుకులో బాలసరస్వతీ స్త్రీ సమాజమును దర్శించినప్పటి ఛాయాచిత్రం.


తెలంగాణా రచయితల సంఘం సికింద్రాబాదు శాఖా ప్రారంభోత్సవ సందర్భంలో తీసిన ఛాయాచిత్రం. ఇందు దాశరథి, లక్ష్మణశాస్త్రి, డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, నానమామలై వరదాచార్యులు, బి. రామరాజు, దివాకర్ల వెంకటావధాని, వేమూరి ఆంజనేయశర్మ ప్రభృతులున్నారు.


సమిశ్రగూడెంలో బీగమ్ అజాద్ స్మారక ఉచిత మాతా సంరక్షణ కేంద్రాన్ని ఆంధ్రసంఘ సంక్షేమబోర్డు అధ్యక్షురాలు శ్రీమతి చెన్నగంటమ్మగారు ప్రారంభించినప్పటి ఫోటో.


ఖమ్మంమెట్టు సాంస్కృతిక సంఘం సమావేశమైనప్పటి ఫోటో. బొమ్మకంటి సత్యనారాయణరావు ప్రభృతులు పాల్గొన్నారు.


కృష్ణాజిల్లా పొగాకు, పరిశీలన మార్కెటు కమిటీకి ఎన్నుకోబడిన వలబోతు రామనాథం (నందిగామ తాలూకా)


కృష్ణాజిల్లా పొగాకు, పరిశీలన మార్కెటు కమిటీకి సభ్యులుగా ఎన్నుకోబడిన కర్నాటి వీరభద్రయ్య (తిరువూరు తాలూకా)

## ఉద్యోగుల కర్తవ్య నిర్వహణం

### ఆంధ్ర అకౌంటెంట్ జనరల్ ఉద్బోధ

మద్రాసు, అక్టోబరు 2: ఆంధ్ర అకౌంటెంటు జనరలు శ్రీ ఎ. యల్. సక్సేనా గారు నిన్న రాత్రి మైలాపూరు ఉడ్‌లాండ్సులో ఆంధ్ర అకౌంటెంటు జనరలు ఆఫీసు ఉద్యోగుల సంఘం ప్రథమ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహిస్తూ సంఘసభ్యులు తమ ఉద్యోగాలలో ఏవిధమైన కష్టనిష్ఠూరాలు వున్నప్పటికీ తమకర్తవ్యమును శ్రద్ధతోను బాధ్యతతోను నిర్వర్తింప గల్గినట్లైతే వారికి హక్కులు తనిచ్చగా లభ్యం కాగలవని హితవొసగినారు.

ఈ సమయమున శ్రీ యస్. రామమూర్తిగారు ప్రసంగిస్తూ విజ్ఞానవంతులు ఇతరులకు ఐక్యతా విషయంలో మార్గదర్శకులుగా వుండి దేశమునను ప్రపంచమునను ఐక్యతాప్రభావాన్ని నిరూపించవచ్చునని అన్నారు.

శ్రీ సక్సేనా గారు సభకు ఆలస్యంగా రావడ జరిగినందున అంతవరకు శ్రీ పి. యస్. రాజగోపాల్ గారు రిటైర్డు ఆడిటర్ జనరలు అధ్యక్షతవహించి కార్యక్రమాన్ని నడిపించారు.

శ్రీ జి. కృష్ణమూర్తిగారు ఆంధ్ర గవర్నరు శ్రీ సి. యం. త్రివేది, విద్యామంత్రి శ్రీ ఎస్. బి పి.పట్టాభిరామారావు, శ్రీ వి. వి. గిరి, శ్రీ కొత్త రఘురామయ్యగార్లు పంపిన సందేశాలను చదివారు.

కార్యదర్శి శ్రీ బి. రంగనాథన్ గారు సంఘ వార్షికనివేదికను చదివి సమర్పించారు. సంఘాధ్యక్షుడు శ్రీ వెంకటరత్నంగారు అతిథులకు స్వాగతమొసగిరి. శ్రీ ఒ. డి. హరిగారు ధన్యవాదా లర్పించినారు. అనంతరం సభ్యులచే వినోదప్రదర్శనము జరుపబడినది.

## విజయవాడ మార్కెట్ ధరలు

విజయవాడ, అక్టోబరు 2: ధాన్యం: 166 పాళ్ల బస్తా కుసుమ 21 రూ. ఢిల్లీ భోగాలు 22-8-0, అక్కుళ్లు 20 రూ. క. 12-21-8-0, 24 నెంబరు 24 రూ.

బియ్యం: 246 పౌనుల బస్తా కుసుమ 49, ఢిల్లీభోగాలు 52, అక్కుళ్లు 48, క. 12, 50, నెం. 24 56.

వేరుశెనగ గింజలు: 177 పౌనులు 44-4-0.

వేరుశెనగకాయ: 168 పౌనులు 18 రూ.లు నూనె 25 పౌనులు 11-6-0, వల్లె పెసలు 340 పౌనుల బస్తా 35 రూ. పప్పుపెసలు 22 రూ. కందులు 20-21 రూ.లు శెనగలు 220 పౌనుల బస్తా 30 రూ.లు ఉలవలు 23-24, మిర్చి మణుగు 17-18, బెల్లం 3-4, కొబ్బరికాయలు వెయ్యి 120 రూ.లు, కొబ్బరినూనె డబ్బా 11-4-0, ధనియాలు 90 పా॥ 39 రూ.లు.

## దక్షిణభారత హిందీ ప్రచారసభ స్నాతకోత్సవం

మదరాసు, అక్టోబరు 2: హైదరాబాదు ముఖ్యమంత్రి శ్రీ బి. రామకృష్ణరావుగారు రాబోవు 10 వ తేదీన దక్షిణభారత హిందీప్రచారసభ పట్టప్రదానోత్సవమున హితోపన్యాసం చేయగలరు [illegible]

## దొంగతనం

మద్రాసు, అక్టోబరు 2: నిన్న రాత్రి వేపేరిలో సుబ్బయ్యనాయుడు గారి ఇంట్లో దొంగలు కిటికీ ఊచలు వంచి రెండు ట్రంకుపెట్టెలు పట్టుకు పోయారు. ఒక పెట్టె ప్రక్క బహిరంగంలో పగలగొట్టబడి ఉన్నది. పోలీసులు దర్యాప్తు చేస్తున్నారు.

# దేశమంతటా గాంధీ జయంతి ఉత్సవాలు

## అస్పృశ్యతా నివారణకు గ్రామోద్ధరణకు

## భారత జాతి కంకణ ధారణ

న్యూఢిల్లీ, అక్టోబరు 2: ఆసేతు శీతనగ పర్యంతమూ ఈనాడు వాడ వాడలా గాంధీజీ 86 వ జన్మదినోత్సవాలు జరుపబడినవి. ఈ విధ్వారరా జాతీ మహాత్ముని పుణ్యసంస్మరణ కావించుకొని, ఆయనకు అత్యంత ప్రీతిపాత్రములైన అస్పృశ్యతానివారణ, గ్రామోద్ధరణ కార్యక్రమాల ఆచరణకు ఈ పర్వదినాన కంకణధారణ చేసింది.

ఈ శోభన హైదరాబాద్‌లో 8 జాతీయవిస్తరణకార్యక్రమక్షేత్రాలకూ మద్రాసు రాష్ట్రంలో 10 క్షేత్రాలకూ ప్రారంభోత్సవాలు జరిగినవి. ఢిల్లీలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ రాజఘాట్‌వద్ద మహాత్మునికి పుష్పాంజలి ఘటించారు. తరువాత ప్రార్థనలో పాల్గొన్నారు. సుమారు రెండువందల మంది పాల్గొన్న సూత్రయజ్ఞంలో రాష్ట్రపతి పాల్గొన్నారు. కేంద్ర రాష్ట్రప్రభుత్వమంత్రులు రాజఘాట్ వద్ద మహాత్ముని సమాధిపై పుష్పమాలలు ఉంచారు.

ఢిల్లీలో ఉన్నప్పుడు మహాత్ముడు నివసించిన 'వాల్మీకి మందిర'లోనూ, మహాత్ముని జన్మస్థలం పోర్‌బందర్‌లో నిర్మించబడిన స్మారకచిహ్నం 'కీర్తి మందిర్'లోనూ గీతాపారాయణ, సంకీర్తనం జరిగాయి.

దేశవ్యాప్తంగా పల్లెలలోనూ పట్నాలలోనూ ప్రభాతభేరీలు జరిగాయి.

ఆంధ్రరాజధాని కర్నూలులో గవర్నరు శ్రీ సి. ఎం. త్రివేది శాసనసభలో మహాత్ముని పాలరాతి విగ్రహాన్ని ఆవిష్కరించారు.

### భోపాల్‌లో అల్లరి

భోపాల్‌లో నేడు మహాత్ముని జయంత్యుత్సవాలు ప్రారంభించడానికి కేంద్ర రవాణామంత్రి శ్రీ జగజీవన్ రాం రాగా ఆయన కారువద్ద కొందరు చేరి అల్లరిచేశారు.

పాదర్ మంజిల్‌లో ఉత్సవాలు ప్రారంభింపబడవలసి వున్నది. కాని ప్రజాతంత్రి పౌరసంఘటనకు చెందిన 1500 మంది భోపాల్ అసెంబ్లీ ఆమోదించిన మున్సిపాలిటీల సవరణబిల్లుపట్ల నిరసన ప్రదర్శనాలు గావించారు.

"బిల్లు రద్దుచేయాలి" "శర్మ ప్రభుత్వము సాగడానికి వీల్లేదు" అని నినాదాలు చేశారు. చప్పట్లుకొట్టి గల్లంతు చేశారు. (భోపాల్ ముఖ్యమంత్రి పేరు శ్రీ డి. శర్మ).

### హైదరాబాద్

హైదరాబాద్, అక్టోబర్ 2: గాంధీజయంతి సందర్భంలో హైదరాబాద్‌లోని జిల్లాలలో నేడు 8 చోట్ల జాతీయవికాస కేంద్రాలు ప్రారంభించబడినవి.

వరంగల్ జిల్లాలో, హనుమకొండ వాస్తవ్యులు ఎం. రామస్వామిగారు ఈ వేళ భూదానయజ్ఞ సమితికి నూరు ఎకరాల భూమిని దానం చేశారు.

హైదరాబాద్ నగరంలో మునిసిపల్ కార్పొరేషన్‌వారు ఒక కొత్త ఆటస్థలాన్ని ప్రారంభించారు. మునిసిపాలిటీ నడుపుతున్న కబేలాలు, మాంసపు దుకాణాలు మూసివేయబడ్డవి.

రాష్ట్రియజ్వార్ సంఘాధ్యక్షుడు మహాదేవసింగ్ గారి నాయకత్వాన ప్రజా సోషలిస్టు పార్టీవారు ఒక ఊరేగింపు జరిపి, అస్సాం, బెంగాల్, బీహార్, యు. పి. వరద బాధితుల సహాయానికి విరాళాలను పోగుచేశారు.

హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు నేడు రేడియోలో ప్రసంగిస్తూ ఈ గాంధీ జయంతినాడు ఖాదీహుండీల విక్రయం ప్రారంభింద బడినదనీ, ప్రజలందరు ఖాదీహుండీలు కొనాలనీ విజ్ఞప్తి చేశారు. ఈ సంవత్సరాంతానికి 7 లక్షల రూ॥ల ఖాదీ హుండీలు హైదరాబాద్ రాష్ట్రంలో విక్రయింప ఉద్దేశించబడినదనీ, గత సంవత్సరం రాష్ట్రంలో 16 లక్షల రూపాయల ఖాదీ తయారైనదనీ ఈ ఉత్పత్తి ఈ ఏడు 20 లక్షలకూ ఐదేళ్లలో 30 లక్షలకు పెంచడానికి కృషి జరుపబడుతుందనీ రామకృష్ణ రావుగారు చెప్పారు.

### కలకత్తా

రాష్ట్రకాంగ్రెసు బహిరంగసభ జరిగింది. కాంగ్రెసు కార్యకర్తలు రాజభవన్‌లో సూత్రయజ్ఞంలో పాల్గొన్నారు.

బోధ్‌పూర్‌లో 4 జాతీయవిస్తరణ క్షేత్రాలు ప్రారంభించబడినవి. జైలు ఉద్యోగులూ, రామధున్ సంకీర్తనం చేశారు.

### విజయవాడ

'భారతవాణి' డాక్యుమెంటరీచిత్ర ప్రదర్శనతో ఇక్కడ జయంత్యుత్సవాలు ప్రారంభింప బడ్డాయి. ప్రదర్శనశాలలో జనం క్రిక్కిరిసి పోయారు. లాహోరు కాంగ్రెసుసభ, దండి సత్యాగ్రహం, గాంధీజీ లండన్‌ప్రయాణం, రౌండుటేబుల్ సమావేశంలో గాంధీజీ, చరిమిలానా ఆయన యూరప్ పర్యటన మొదలైన చరిత్రాత్మకదృశ్యాలు ప్రదర్శించబడినవి.

### జమ్మూ

సూత్రయజ్ఞం జరిగింది. ప్రభాత్ ఫేరీలు, బహిరంగ సభలూ జరిపి ప్రజలు మహాత్మునికి జోహారులు అర్పించారు. గాంధీజీ బోధించిన సిద్ధాంతాలను ప్రజలు ఆచరణలో పెట్టాలని స్వామి విమలముని ఉద్బోధించారు.

### శ్రీ పట్టాభి జోహార్లు

నాగపూరు, అక్టోబరు 2: "యుద్ధనినాదాలతో, దర్పాలతో సతమతమవుతున్న ప్రపంచానికి నూతన శాంతిపథం చూపిన భారతమాత పుత్రులలో మహాత్ముడు అత్యంత ప్రముఖ స్థానం ఆక్రమించాడు" అని మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ పట్టాభి సీతారామయ్యగారు మహాత్మునికి జోహారు లర్పించారు. గాంధిజయంతి సందర్భంలో రేడియోలో ప్రసంగిస్తూ, "మహాత్మాగాంధీ అవతార పురుషుడు కాకపోవచ్చు, ఉపనిషత్తులలోని పూర్ణపురుషుడు కాకపోవచ్చు, కాని ఆయన భారతదేశపు చిరంజీవులలో ఒకరు. ఆయన చూపిన సత్యాహింసల మార్గాలను అందరు అనుసరించాలి" అని వుద్బోధించారు.

గాంధీజీ అనుంగు శిష్యుడుగా స్నేహాలను అభివర్ధిస్తూ భారతీయ ప్రజాస్వామ్యానికి ఒక నూతన నిర్వచనం యిచ్చారని అన్నారు.

నాగపూరులో గాంధిజయంతి సందర్భంగా "మద్యరక్కసి" బొమ్మలు పూరేగించి తగులపెట్టారు. ఊరేగింపులు, సినిమా ప్రదర్శనల మూలంగా ప్రచారం గావించారు. ఈ ఉదయం మద్యనిషేధ వారాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు. విద్యార్థులు నగరంలో ఊరేగింపు జరిపారు.

గవర్నరు శ్రీ పట్టాభి తమ సందేశంలో యీ త్రాగుడు వ్యసనం స్త్రీల పట్ల ఎంతో హాని కలిగిస్తోందనీ, పేదవానికిది నరకప్రాయమనీ పేర్కొన్నారు.

రాజకోట, బెంగుళూరు నగరాలలో కూడ గాంధీజయంత్యుత్సవాలు జరిగినవి. బెంగుళూరులో కసాయిశాలలు, మాంసాహార విక్రయశాలలు అన్నీ మూసేశారు. ఖద్దరు హుండీల అమ్మకం జరిగింది.

### బొంబై

బొంబై, అక్టోబరు 2: మహాత్ముని 86 వ జన్మదినోత్సవం నేడు బొంబైలో అత్యంతవైభవంగా జరుపబడింది. ఉత్తరబొంబైలో వేలకొద్దీ స్కూలు విద్యార్థులు ఊరేగింపులు జరిపారు. సంఘసేవకులు హరిజన పేటలలో సంక్షేమ కార్యక్రమాలు అమలుజరిపారు.

ఒకచోట జరిగిన బహిరంగసభలో శ్రీ పాటిల్ పతాకోత్సవం గావిస్తూ, సంకుచితతత్వాలు విడనాడి జాతీయ ఐక్యతను సుస్థిరంచేయాలని ప్రజలను కోరారు. ఉత్తర బొంబైలో జరిగిన సభలో మేయరు దయాభాయ్‌పటేల్ ప్రసంగిస్తూ, మతైక్యత, గ్రామోద్ధరణ ఖద్దరువ్యాప్తికి కృషిచేయాలని ఉద్బోధించారు.

హరిజన సేవకసంఘం హరిజన పేటలలో పారిశుద్ధ్య కార్యక్రమం ప్రారంభించారు.

### అహమ్మదాబాదు

అహమ్మదాబాదు, అక్టోబరు 2: సంఘసేవకులు, విద్యార్థులు నేడు నగర మేయరు అధ్వర్యాన మైలుపొడవు పూరేగింపుతో హరిజన ప్రాంతాలకు వెళ్ళి శుభ్రపరిచారు.

పిమ్మట బహిరంగసభ జరిగింది. కలెక్టరు పతాకోత్సవం గావించారు. 500 రూపాయల ఖాదీహుండీలు అమ్ముడుపోయినవి. గాంధీ జయంతి సందర్భంలో ప్రభాత ఫేరీలు పలుచోట్ల జరిపారు.

### నగరంలో గాంధిజయంతి ఉత్సవాలు

మదరాసు, అక్టోబరు 2: మదరాసు నగరంలో యీనాడు గాంధీ జయంత్యుత్సవమును పలుసంస్థలవారు జరిపారు. అన్ని పబ్లిక్ భవనాలపై జాతీయపతాకాలు ఎగురవేయబడినవి. పబ్లిక్ ఆఫీసులేగాక కొన్ని దుకాణాలు కూడా మూయబడ్డవి. బహిరంగసభలు జాతీయపతాకోత్సవాలు, బీదల అన్నప్రదానములలో యీ ఉత్సవము జరుపబడినది.

### బరోడా

గాంధీజయంతిని నేడు హరిజనదినోత్సవంగా హరిజన సేవకసంఘం నగర కాంగ్రెసు సంఘంవారు జరిపారు. ప్రైమరీ పాఠశాలల విద్యార్థుల శ్రమదానయజ్ఞం ఆటల పోటీలు జరుపబడెను.

### పుదుచ్చేరి

పుదుచ్చేరి అంతటా గాంధీజయంతి మహోత్సాహంతో జరుపబడింది. ఇండియా కాన్సల్ జనరల్ కేవల్ సింగ్ విద్యాసంస్థలలో జరిగిన ఉత్సవాలన్నిటికీ వెళ్లారు. భారత యువక సంఘంవారు 5 వందలమంది బీదలకు అన్నదానంచేశారు. సాయంత్రం బహిరంగసభ జరిగింది.

